# దేశిరాజు పెదబాపయ్యగారి

# జీవనస్మృతి

కర్త

కామరాజు హనుమంతరావు

రాజమహేంద్రవరము

1928

వెల రు 1-0-0.

# స ర్వ స్వా మ్య సంకలితము

## మొదటికూర్పు

శ్రీ ఆద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము.

# విషయసూచిక

# విజ్ఞప్తి

దేశిరాజు పెదబాపయ్యగారి చరిత్రను సమర్థు లయిన వా రెవరయిన రచియింపవలయు నని వారు పరలోకగతు లయినప్పటినుండియు నభిలషించు చుంటిని. ఇప్పటికి వారు మృతి జెంది యిరువది సంవత్సరము లయినది. వారినిగురించి యెరిగిన విషయములు చెప్పగల మిత్రులు కూడ గతించి పోవుచున్నారు. వారి చరిత్ర వ్రాయుట కన్య లెవరును పూనుకొన కున్నారు.

వారి జీవనవృత్తాంతము నా కెక్కువ తెలియుట కవ కాశము కలిగినది. నా అక్కగారు బాపయ్యగారి సవతితల్లి. మే మిరువురము శైశవమున మాతృహీనుల మై ఆమెవద్ద పెరిగితిమి. వారు నాకంటె నాలుగు సంవత్సరములు మాత్రము పెద్ద. వారు జీవించి యున్నంత కాలము వారి సహచరుడ నయి మిక్కిలి చనువుతో మెలగితిని. వారి జీవిత ముత్తమ మయిన దని కనుగొంటిని. అది గ్రంథరూపమున ప్రకటింప బడిన, వారి నెరుగని తోడి దేశీయులకు గూడ నుపయోగ పడగల దని నమ్మితిని. కావున నేనే ఆ పనికి సాహసించి యీశ్వరకృపవలన దానిని చేతనయిన రీతిని కొనసాగింప గలిగితిని. నా యసమర్థతవలన గ్రంథరచనయందు అనేక

లోపములు చేసియుందును. పాఠకులు వానిని మన్నింప ప్రార్థితులు. సవరణ లేవయిన వారు దయతో తెలిపిన, వానిని రెండవ కూర్పునందు చేసికొందును. క్రొత్త విషయములు తెలుపబడిన, అవియు నందు జేర్చెదను.

దినచర్యాపుస్తకములను ఉత్తరములను ఇచ్చియు, సంగతులను తెలిపియు, ధనసాహాయ్యము చేసియు, ఇంక నితర విధముల సాయపడియు, ఈ పుస్తకప్రచురణమునందు నాకు తోడ్పడిన బంధుమిత్రు లెల్లరకు కృతజ్ఞుడను. బాపయ్యగారు వ్రాసిన వని యిందు తెనుగున పొందుపరుపబడిన వన్నియు ఆంగ్లమునకు భాషాంతరీకరణములు. వానిలో నచటచట బ్రాకెట్లలో చేర్పబడిన మాటలును, కొన్ని మాటలక్రింద గీయబడిన గీతలును నావి.

అచ్చుపని స్వల్పకాలములో జరుప వలసి వచ్చినను, ముద్రణాసౌకర్యములను కలిగించి పుస్తకము సకాలమునకు వెలువడు నట్లు జేసిన సరస్వతీ ముద్రాక్షరశాలాధికారులు అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయడుగారికి నా వందనములు.

---

☞ పుస్తకము చివర నున్న తప్పొప్పుల పట్టికను చదువరులు ముందుగా చూడ ప్రార్థితులు.

# స్మృతి గీతము

చిన్న నాటనుండియు నీదు చెలిమి గలిగి,
నిన్నె నా మార్గదర్శిగ నెన్ను కొనగ,
తరలి దివికి, నాత్మకు ధ్రువతార వైతి,
బాపయాఖ్య! సంస్మృతియె నా భాగ్య మయ్యె.

కనుల యెదుట నీ నగుమోము కదలు చుండు,
చెవులలోన నీ మృదుభాష చెలగు చుండు,
మనమునందు నీ గుణరాజి మసలు చుండు,
నీదు స్మృతి లేక గడచునె? నిమిష మైన.

బంధువులలోన నుత్తమ బంధు వైన,
సహచరులలోన ప్రియతమ సఖుడ వైన,
గురువులందున నుత్కృష్టగురుడ వైన,
నిన్ను స్మరియించి ధన్యగా నెమ్మి దలతు.

మిన్నగ నిను నాకంటె, ప్రేమించు వారు,
ధర్మదర్శకునిగ మది దలచు వారు,
అనుకరించి సద్వర్తను లయిన వారు,
భక్తి తమ స్మృతు లిం దైక్య పరచి నారు.

మమ్ము నెల్లర, నిను సదా మరువ కుండ,
విశ్వమాతను నిరతము వీడ కుండ,
విమలవర్తన మెప్పుడు విడువ కుండ,
జేయు నీ స్మృతి యభివృద్ధి జెందు గాక!

# జీవన స్మృతి

## ౧ వ ప్రకరణము

### సూచన

"ఒక పర్యాయం 'నిను సేవింపని పుట్టువ దేటికి?' అనే కీర్తన పాడ్తారా? సీతారామయ్యగారూ!' అని బాపయ్యగారు మంచముమీద కూరుండియె అడిగి కరములు జోడించి నిమీలితనేత్రు లయిరి. సీతారామయ్యగారు మృదుమధురస్వరముతో భక్తిరస మొలుక ఈ క్రింది కీర్తన పాడిరి.

'నిను సేవింపని పుట్టువ దేటికి? నిఖిలజగదధీశా! ఈశా!
నీ నిర్మితి జూడని కను లేమిటికి? నిష్ఫలములు ధరలోను.

౧. నిను జింతింపని చింత యేమిటికి? నీగుణు లేని కాల కేమిటికి? నిను బాడని యా కృతు లేమిటికి? నెసరు లేని యా మగతన మేటికి?

౨. నిను గురించని ముచ్చట లేటికి? నీచులతోడను స్నేహము లేటికి? పని లేకుండెడి బ్రతు కేమిటికి? భక్తి లేని ధ్యానం బేమిటికి?

౩. ప్రత్యుపకారము చేయమి యేటికి? ప్రాణిహింసయు

జేయుట యేటికి? మెతుకులకొరకిచ్చుక మేటికి? మిత్తి నిత్య మని తెలియమి యేటికి?

४. సర్వకర్తను దెలియమి యేటికి? చంచలమతులను గూడుట యేటికి? గర్వము విడువక యుండుట యేటికి? కడకను నిత్యుని గూడమి యేటికి?

మంచముప్రక్క సీతారామయ్యగారును నేనును నిలువబడి బాపయ్యగారి ముఖారవిందమును దర్శించుచుంటిమి. కీర్తన ముగిసిన పిమ్మట కొన్ని నిమిషములవరకు గూడ కన్నులు మూయబడియె యుండెను. నోటినుండి యెట్టి మాటలు వెడలుట లేదు. కాని వదనము అంతకంతకు అద్దమువలె నిర్మలమును తేజోవంతము నయి అంతరభావముల వ్యక్తపరచుచుండెను.

సమయము ప్రభాతము. భాను డప్పుడప్పుడె ఉదయించుచుండెను. నీరెండ నలుదిశల నావరించి హృదయాంతరాళమందలి యంధకారమును సయితము పారద్రోలుచుండెను. వికసించిన కుసుమములు సుగంధము వెదజల్లుచు పరమపురుషుని సాన్నిధ్యము స్మరణకు దెచ్చుచుండెను. పక్షుల కిలకిలారవము లుద్బోధనగీతము లయి వీనులకు విందు గొల్పుచు ఈశ్వరధ్యానము పురిగొల్పుచుండెను.

స్థలము చెన్నపురి జనరల్‌హాస్పిటల్. బహువిధవ్యాధి

పీడితులకు శరణ్యమయి ఔషధశస్త్రచికిత్సాదక్షులగు వైద్య శిఖామణులకు నిలయ మయి ఆర్తజనబాంధవు డగు సర్వే శ్వరుని యాలయముగ సువిదిత మగుచుండెను. సుందరదృశ్య ములు గన్నులకు పండువ సేయు నప్పుడును, సంతోషసల్లాప ముల నోలలాడు నప్పుడును, సకలైశ్వర్యములతో తులతూగు నప్పుడును, జగన్మాతను దర్శించు భాగ్యము ఏ కొలది మందికో లభ్యమగును గాని భయంకరవిపత్సమయములందు ప్రేమ స్వరూపిణి యగు పరమమాతయె సమస్తోపచారములు చేయుచు ధైర్యోత్సాహముల నొసంగి మరణబాధనయినను మరపించు తరుణమునందు మాత్రము ఎవ రామె చల్లని కరుణాహస్తమును స్పర్శింపకుందురు? హాస్పిటలులోని సేవకు లెల్లరిద్వారా పవిత్రప్రేమ ప్రత్యక్షమగుచు తాండవమాడు చుండెను.

కీర్తన పాడిన పిళ్ళారిశెట్టి సీతారామయ్యగారు హరి కథలు వీలు కలిగి నపుడెల్ల జెప్పుచు తోడిమానవులయందు దైవభక్తి రవులుకొల్పుచుండిన భక్తాగ్రేసరులు. మానవ సేవయె నిరంతరవ్రతముగా గలిగి శోకసాగరనిమగ్నలగు బాలవితంతువులకొరకును, తిన తిండియు కట్ట గుడ్డయు లేక నానాబాధలు పడెడు దిక్కులేని బిడ్డలకొరకును, కష్టసమయ ములందు దసహాయులై యుండిన తమ పరిచితులెల్లరికొరకును,

ఓపికకొలది పాటుపడుచుండిన సేవాధురీణులు. బాపయ్య గారు చాల జబ్బుచేసి చెన్నపురి జనరల్ హాస్పిటలుకు వచ్చిన తరువాత వారి యవసానసమయము సమీపించిన దను దుః ఖకరవార్త తంతిద్వారా బాపట్లలోనున్న వారి బంధువు లకు వచ్చినదని వినగానె వారిని దర్శించుట కేతెంచిన పర మమిత్రులు. 'నాకు తంతివార్త పంపించ లేదేమండి?' యని తాము ప్రశ్నింప, 'కబు రేలా తెలిసినా, మీరు తప్పక వస్తారని నా గట్టినమ్మకం. మీకు తంతివార్త పం పడ మనవసర మనియె మానితి' నని బాపయ్యగారు బదు లుచెప్పగా అట్టిప్రశంసకు పాత్రు లయినందులకు సంతుష్ట హృదయు లయి వారి యంత్యదినములలో సేవచేయుచు వారిదగ్గిర నుండిన పుణ్యపురుషులు. సీతారామయ్యగారు పాడిన కీర్తన పెదవులనుండి గాక హృదయమునుండి వెలు వడి సమయోచిత మయి ప్రాణముల నుజ్జీవింపజేసెను.

బాపయ్యగారు తాము పరుండిన మంచము ధర్మ వేదికగను వైద్యశాల ఉపాసనామందిరముగను గలిగి నాటి యుదయమున సీతారామయ్యగారు కీర్తన పాడిన పిమ్మట మౌనరూపమున గావించిన యుపాసన అత్యద్భుతముగ నుం డెను. వారు అదివరకు వాగ్రూపమున జేసిన యుపాసన లన్నిటికంటె నది యెక్కుడు ప్రబోధము కలిగించెను. త్రిక

రణశుద్ధి గలవారు కొలది మాటలమూలమున గాని లేక అవియు నక్కరలేకయె కేవల మౌనమువలన గాని అమితోత్సాహకర మగు ఈశ్వరోపాసన చేయగలరని సువ్యక్తమాయెను. శరీరసౌఖ్యములు గాక ఆత్మానందమె శాశ్వతమయిన దని తమ నిశ్చలతమూలముననను, జీవితోపరిభాగముసనె భేదములును వైరములును కలహములును గానవచ్చును గాని జీవితాంతరాళమున నైక్యతయు ప్రేమసంబంధమును సహకారజీవనమును నెలకొనియుండు నని తమ గభీరతమూలముననను, జగజ్జనని విడిచి జీవనయాత్ర సలుపు నప్పు డైహికబాధలు సంతాపకరము లయినను ఆమెకరుణాముఖమును వీక్షించుచు ఆమెప్రేమహస్తములచే లాలింపబడుచు అభయాశ్రయ మయిన యామెయొడియందు శయనించు నప్పుడు మాత్రము ప్రాపంచికదురవస్థ లేవియు బాధింపనేర వని తమప్రశాంతతమూలముననను, బాపయ్యగారు ప్రకటించుచుండిరి. సత్యశివసుందరస్వరూపుని విలాసము నిర్మలమగు వారిమోముద్వారా ప్రకాశించుచుండెను. 'ఈశ్వరా! నాయిచ్ఛ గాక నీయిచ్ఛయె నెరవేరుగాక!' యని యుత్తమ రీతిని వారు ప్రార్థించుచుండినటుల ముఖమునందు స్పష్టముగ గాన్పించుచుండిన వినమ్రత వెల్లడిజేయుచుండెను. వారివదనమును చూచుచు వారిసమీపమున నిలిచియున్న మే మిరు

వుర యొక విచిత్రనిశ్శబ్దోపాసనయందు పాల్గొనినవార మయి విస్మయము జెందితిమి. పరమేశ్వరునకు ధన్యవాదము లర్పించితిమి.

మృత్యుశయ్యనుండి యీ మౌనోపాసన జరిపినది మన కథానాయకులయిన దేశిరాజు పెదబాపయ్యగా రని చదు వరు లిదివరకె యూహించియుందురు. వారు ధన్యచరితులు. ఈశ్వరోపాసన వారికి నిత్యకృత్యము. సంధ్యాసమయము లందు నిష్ఠతో దైనికోపాసన జరపుకొనుట కభ్యాసపడిన వా రగుటచే, అమితబాధపడుచుండిన దినములందు గూడ ఆ యభ్యాసము వారు విడువజాలకుండిరి. సరళహృదయముతో ప్రార్థన చేయునప్పు డెవరయినను తమయుత్తమాశయసాఫ ల్యమునె సహజముగ నభిలషింతురు. ఇక నిష్కపటప్రార్థన శీలురు మృత్యుముఖమున ప్రవేశింప నున్నతరి తమ వాస్త వమయిన అభీప్సితమునె ముఖ్యముగ వెల్లడింతు రని వేరుగ జెప్పనక్కరలేదు. కావున పెదబాపయ్యగారు నాడు ప్రార్థన సమయమున వినగోరినకీర్తన వారి జీవితరహస్యమును వ్యక్త పరచుచున్న దని సీతారామయ్యగారికిని నాకును వెంటనే స్ఫురించెను. వారి జీవితము ఈశ్వరార్పితము ఋ సేవాదర్శ మునకు నిదర్శనముగా నుండుటవలన 'నిను సేవింపని పుట్టువ దేటికి?' అను నుద్బోధనసూత్రమె వారిజీవితమును నడిపి ధన్య

తనొందించె నని మాయిద్దరకును మాద్వారా ఈ వృత్తాంత
ము వినిన మిత్రులకును దోచెను. అప్పటినుండి 'నిను సేవిం
పని పుట్టువ దేటికి?' అను కీర్తన బాపయ్యగారి కీర్తన యని
చెప్పుకొనుచు పాడుకొనుట ఆంధ్రదేశమందలి బ్రాహ్మప్రా
ర్థనసమాజసభ్యులకు పరిపాటియైనది. తమ శక్తిసామర్థ్య
ములకును, అభిరుచులకును, అవకాశములకును తగినటుల
ఈశ్వరసేవ సలిపి తరించినఘనులు బాపయ్యగారు. వారిని
స్వార్థత్యాగిని చేసినది అనుదినప్రార్థనయె. వారు పూర్వా
చారము లనుసరించు చుండినప్పుడు, తప్పక ప్రతిదినము సం
ధ్యావందనము అతిశ్రద్ధాభక్తులతో సలిపియుండిరి. జీవితము
సంస్కరణమార్గమున మరలి నడచుచుండినప్పుడు గూడ, పరి
శుద్ధాస్తిక్యభావ మనుసరించి నియమముతో దైనికప్రార్థన జరి
పిరి. ఒకదినమున నొక బహిరంగసభలో సంస్కారపరులన
సంధ్యావందనాదిపూర్వసదాచారముల విసర్జించువారని యా
క్షేపించుచు నొక పూర్వాచారపరాయణుడు మాటాడిన తరు
వాత బాపయ్యగారు నిలువబడి సంధ్యావందనమనగా సర్వాం
తర్యామియగు జగదేకపితయొక్క ప్రార్థనమె యని మీ
తాత్పర్య మయినయెడల నే నది ప్రతిదినము అనుష్ఠించువా
డనె' యని చెప్పుకొనగలిగిరి. అవి దంభోక్తు లెంతమాత్ర
ము గావని వారి దైనికజీవితముతో నేపాటి పరిచయముగల

వారయినను గ్రహింతురు. దైనికప్రార్థన వారికి ఆత్మబలము
ను కార్యోత్సాహమును సద్వర్తనము నలవడజేసి వారిజీవిత
మును పూర్ణముగ వికసించిన యొకసుందరకుసుమమువలె
మార్చెను.

౧౯౦౬ వ సంవత్సరము డిశంబరు ౨ వ తేదీన బాప
య్యగారు తమ దినచర్యపుస్తకమునందు నీదిగువ పొందుపరు
పబడినది వ్రాసికొనిరి.

"మా మామగారు బరంపురమునుండి రాజమహేం
ద్రవరమున కేగుచు త్రోవలో నిచట (విశాఖపట్టణమునందు)
దయతో ఆగి సుమారు అరగంటసేపు నాతోడ గడిపిరి. వారి
కోపము చాల తగ్గియుండెను. మిక్కిలిచనువుతో మాటా
డిరి. 'నీవు నీ ధర్మములన్నిటిని కలిగియున్నప్పటికి, నీవు
రాజమహేంద్రవరములో మొదటనుండినవిధమున జీవింపవ
చ్చును' అని చెప్పుచు పూర్వగాథను తిరిగిఎత్తిరి. 'నీయభి
ప్రాయములు మనసులో నుంచుకొనుము గాని బాహ్యవే
షము దాల్చి బ్రాహ్మణుడ వనిపించుకొనుము' మనియె వారు
నుడివినమాటల యుద్దేశము. వంటమనుష్యునిగాని తమపిన
తల్లినిగాని లేక మాతల్లినిగాని, నీవు వారిని బెదరగొట్టనియె
డల, నీవద్దకు పంపెదను...నాయుముగా రోసంగెడు భోజనము
నేను తినుచుండుట వారి కయిష్టముగా నుండెను. ఈ కారణ

ముచేత ఆ నాయడుగారిని చూచుటను మానిరి. కార్డులు
గాక వివరముగ పెద్దయుత్తరములు వ్రాయుమని నన్ను గోరి
రి. అదియంతయు మిక్కిలిబాగుగనె యున్నది. కాని ప్రేమ
పూర్వకముగ చేయదలచిన యీసాహాయ్యములతో నన్ను
కొనివేయజూచుట వారి కేమి భావ్యము? ఓ దేవా! నీ కొర
కును, నాయాత్మకొరకును, నా దేశముకొరకును నేను నిర్వ
హింపవలసిన విధికృత్యముల జ్ఞప్తియుంచుకొనులాగున కటా
క్షింపుము. తండ్రీ!ఆత్మగౌరవభావమును స్వార్థత్యాగబుద్ధియు
నాకనుగ్రహించి నీ యొక్క యథార్థబోధునివలెను సేవకుని
వలెను సకలశోధనలను కష్టములను నెదుర్కొన నన్ను సమర్థుని
జేయుము. నీవు నా పక్షము వహించిన, ఎవరు నా కెదురు
నిలుతురు? నేను కోరినచో, తమ బైసికిలును నాకు పంపెద
మని మా మామగారు చెప్పిరి. ఈ ప్రీతిపూర్వకబహుమాన
ముల నంగీకరించియు నేను వారిసంఘమున తిరిగి చేరనిపక్ష
మున నన్నింకెంత కృతఘ్నునిగా వారెంచెదరు? హే ప్ర
భో! నన్ను ప్రలోభనములకు లొంగనీయకుము. ‘ఓ సైతా
నా! నన్ను భ్రమపెట్టకుము. నావెనుకకు పొమ్ము.’ అని
పూర్వము క్రైస్తు చెప్పినటుల నేనును చెప్పుటకు శక్తి
నిమ్ము. తండ్రీ! అస్థిరములగు ప్రాపంచికవిషయములను నన్నం
తగ వాంఛింపనీయకుము. కాని నిజమయిన భక్తునకు లభిం

చెడు ఆధ్యాత్మికసుఖముకొరకును ఆనందముకొరకును నన్ను నిరంతరము పరితపింప నిమ్ము. నన్ను నీనామము కీర్తింపనిమ్ము. నన్ను నీ యాజ్ఞలను పూర్తిగ పాలింప నిమ్ము. అన్యులెవరినిగాక నిన్నే నన్ను సేవింప నిమ్ము. ఆవశ్యకమయినచో, నీ సేవయందు నా ప్రాణమును అర్పింప నిమ్ము."

ఈవాక్యములు గాఢధర్మానురాగమును, అపూర్వ కార్యదీక్షను, అద్భుతత్యాగశీలమును, అకుంఠితసేవాతత్పరతయు వెల్లడిజేయుచున్నవి. తమ నమ్మకముల ప్రకారము బాపయ్యగారి మేలుకోరి వారి ప్రియబంధువులు వారిని తమ మార్గమునకు మరల్చుటకు సామదానభేదదండోపాయము లన్నియు ప్రయోగించుట సహజము. బాపయ్యగారు వారల నెన్నడును ద్వేషింపలేదు. కాని బంధువు లెన్నివిధముల శోధించినను, సంఘము బహిష్కరించినను, గృహకృత్యము లకొరకు సేవకులు కుదురక యెన్నిశ్రమలు పడవలసివచ్చినను, దుస్సహమయిన రోగము పీల్చి పిప్పిచేయుచున్నదినములలో గూడ నిసుమంతయు జంకక తమ విశ్వాసానుగుణమయిన యాచరణమును మాత్రము విడిచినవారు కారు. నిర్మలదైవభక్తియు, సర్వజనసౌభ్రాత్రమును, ఉత్తమదేశాభిమానమును తమజీవితమున దృష్టాంతరూపమున కనపరచి జీవించినకొలదికాలములోనె నూతనధర్మజీవనమునకు ఆంధ్ర

దేశమునందు ఆదర్శపురుషులు కాగలిగిరి. వారు సుమారు ౨౬ సంవత్సరములు జీవించిరి. ఈస్వల్పకాలములోనె వారి జీవితము ప్రఫుల్లతజెందెను. "కొద్దిసంవత్సరములు జీవించినను, భక్తులు పొందనభిలషింపదగిన పరిపక్వచిత్తమును, యోగులకు నీర్ష్య జనింపజేయునంతటి గభీరప్రశాంతతను, ప్రవక్తలు దృష్టాంతముగ గైకొని యనుకరింప నర్హమయిన దృఢవిశ్వాసమును బడయగలిగినయువకు డీతడు. తనమరణానంతరము జీవించి యుండినవారికి నుత్తమధర్మజీవనము పురికొల్పు ఆదర్శపురుషుడు కాగలుగునట్లు ఈత డీకొలది సంవత్సరములు జీవించెను." అని చెన్నపురి విశ్వవిద్యాలయముయొక్క ప్రస్తుతపు వైస్‌ఛాన్సెల్లర్, పూజనీయులగు దీవాన్‌బహద్దర్ సర్ డాక్టర్ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారు బాపయ్యగారి స్మరణార్థము వారు చనిపోయినసంవత్సరము కాకినాడలో జరుపబడిన యుపాసనాసభయందు ప్రశంసించియుండిరి. ఎల్లెడలను, అటులనె ఆంధ్రదేశమందును, బ్రాహ్మసమాజము, సంఘోద్ధరణమునకు వలసిన బాహ్యసంస్కరణ కార్యములతో గూడి యొకవిధమగురూపమును, హృదయశుష్కత్వము తొలగింపగలిగిన ధర్మజీవనముతో గూడి మరియొకవిధమగు రూపమును దాల్చెననియు, ఆంధ్రదేశమునందు మొదటిది కీర్తిశేషులయిన రావుబహా

ద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారియందును రెండవది బాపయ్యగారియందును నిదర్శనములుగ మూర్తీభవించెననియు వెంకటరత్నమునాయుడుగారు మరియొకసందర్భమున వాక్రుచ్చిరి. కీర్తిశేషులయిన రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారిట్లు తమ స్వీయచరిత్రమున వ్రాసిరి. "ఈవిషయమున (ధర్మానుష్ఠానవిషయమున) నాకాయన మార్గదర్శకులయినందులకు మిక్కిలి సంతోషించితిని. అత్యల్పకాలములోనె పరలోకయాత్రకు ప్రయాణము కట్టుకొనియున్న నా యనుష్ఠానపరత్వమువలన నాయంతరాత్మతృప్తి తప్ప లోకమునకు మేలు తెలుగునని భావింపలేదు గాని లేఁబ్రాయమువాఁడును, చిరకాలము బ్రదుకవలసినవాఁడును, నిరుపమానసద్వర్తనుఁడును, సంస్కారదీక్షాదక్షుండును నయిన బాపయ్యగారి యనుష్ఠానపరత్వమున పరిశుద్ధాస్తికమతవ్యాపనమునకును, సంఘసంస్కారాభివృద్ధికిని విశేషప్రయోజనము కలుగునని నేను నమ్మియుంటిని." ఆంధ్రదేశమునందు మతసంఘసంస్కారోద్యమముల విషయమున చిరకాలమునుండి పాటుపడుచు నాయకులని పరిగణింపబడుచున్న వీరేశలింగముపంతులుగారియొక్కయు వెంకటరత్నమునాయుడుగారియొక్కయు స్తోత్రమునకు పాత్రులయి బాపయ్యగారు ఆంధ్రజాతీయజీవనమున నొకయగ్రస్థానము

బడసిరి. కర్మరూపమున పరిణమింపని భక్తియు, భక్తిప్రేరితముగాని కర్మయు అస్వాభావికము లగుటవలన ఆత్మకు తృప్తి నీయజాలవు. భక్తిని కర్మను సమరసపరచుకొని తమ జీవితమును సర్వాంగోన్నతి జెందించుకొనుటచే భావయ్యగారు భక్తియోగులకును కర్మయోగులకును ఆదర్శప్రాయులయిరి.

వీరేశలింగముపంతులుగారు ఆశీర్వదించినట్లు భావయ్యగారు చిరకాలము జీవించుభాగ్యము ఆంధ్రదేశమునకు లభింపకపోయినను, వెంకటరత్నమునాయుడుగారు నిరూపించినటుల వారు జీవించిన స్వల్పకాలములోనె గొప్పభక్తులయి భక్తిబీజములు దేశమందు నలుగడల వెదజల్లుటయేగాక మరి కొందరిహృదయములలో బాగుగ నాటుకొని మొలకెత్తి పండుటకును కృషిసలిపియుండుటచే ఆంధ్రదేశమునకు మహోపకారము చేసినవారయిరి. వారు చూపిన ధర్మపథము క్రమక్రమముగా ఒకరినుండి యొకరికి వ్యాపించుచున్నది.

కవిశేఖరుడు రవీంద్రనాథఠాకూరుగారు సెలవిచ్చిన యీక్రింది యమూల్యవచనములు భావయ్యగారివిషయమునందు సార్థకములయినవి.

"నిత్యునియొక్క స్వరూపమును చిన్నవసంతమ్ము అల్పకాలములోనె క్రింద రాలిపోవునప్పటికి అది మొల్కలు చిర

కాలధనము కాగలుగుచున్నదో, అట్లే ఏమనుష్యునియంతర మున ఆత్మ సమస్తబాహ్యోపాదానములను తనవిగ జేసికొని జీవనమును తనదిగ ప్రకాశింపజేయునో ఆయాత్మకు ఖ్యాతి యుండినను లేకపోయినను అది కాలమునందు విస్తృతాకారము దాల్చినను దాల్చకపోయినను దానియందు నిత్యుని యొక్క ప్రతిరూపము గాన్పించును. ఖండఖండములుగ నుండి ప్రతిముహూర్తమునను మృత్యుచ్ఛాయామాత్రమయి కన్పట్టు అసంపూర్ణకాలమును ఆయాత్మ జయించును."

బాపయ్యగారి సుందరజీవితకుసుమము ఎవరిహృదయ మాకర్షింపకుండును?

———

# జీవనస్మృతి

## ౧ వ ప్రకరణము

### వంశము

బెజవాడనుండి చెన్నపురికి రైలుమీఁద ప్రయాణము చేసినవారు బాపట్లస్టేషను చూచియుందురు. ఆంధ్రదేశమున మతసాంఘిక రాజకీయోద్యమము లందుఁ జేరి ధైర్యముతోఁ బోరాడఁగల కొందరు వీరులు బయలుదేరిన గుంటూరుమండలములోని గ్రామములలో నది యొకటి. సముద్రమున కనతి దూరములో నుండి ఆరోగ్యవంతమయి నివాసయోగ్యముగా నుండును. తాలూకాకచేరి, మునసబుకోర్టు, సబుకోర్టులు, హైస్కూలు, క్రైస్తవపాదరీలగృహములు, రైలుస్టేషనుకు సంబంధించిన యిండ్లు, మేడలు, రోడ్లు మున్నగునవి కలిగి యిప్పు డది యొక పట్టణాకారము దాల్చినది. కాని పూర్వము సామాన్యకుగ్రామము. ఊరంతయు తెల్లనియిసుకతో నిండి వెన్నెలరాత్రులందు నెచట నయినను గ్రామవాసులు బట్టలు పరచుకొని పరుండి యానందించుటకు తగియుండెను. దక్షిణ దిక్కున సముద్రమునకు బోవు మార్గమధ్యమున విశాలమ

యిన పచ్చికబయళ్ళు, సంగీతపుచెట్లతోపులు, తాళవృక్ష
ములగుంపులు, మొగిలిచెట్లబారులు, దట్టమయిన యడవి
మొదలగు చిత్తాకర్షకములయిన ప్రకృతిదృశ్యములు గలవు.
ఉత్తరభాగమున కృష్ణానదియొక్క కాలువనీటితో సేద్యము
చేయబడు మాగాణిభూములు మానవకృషియొక్క ఫలితము
లు చూపుచుండును. తూర్పుపడమరవైపులకు సూరినడుమగా
కలకత్తా చెన్నపురిపట్టణములకు బోవు కంకరరోడ్డు గ్రామస్థు
లితరపట్టణవాసులతో రాకపోకలు గలిగియుండుటకు తోడ్ప
డును. ఆత్మవికాసమునకును శరీరశక్తుల విజృంభణమునకును
సాంఘికజీవనాభివృద్ధికిని చక్కని యనుకూలమయిన యీ బా
పట్లగ్రామమున దేశిరాజువారి కుటుంబమొకటి చిరకాలము
నుండి నివసించుచుండెను. దేశిరాజువారు ఆరువేలనియోగి
బ్రాహ్మణులు; కౌండిన్యసగోత్రులు.

బాపట్లగ్రామసమీపములో అప్పాపురగ్రామమందు
'వెంకయ్యగారిచెరువు' అని పిలువబడు తటాకమొకటి
కలదు. ఆకొలను ఎవరిపేర బరగుచున్నదో, ఆయన సిరిసంప
దలు గలిగి పరోపకారపరాయణులయి జనులసౌఖ్యమునకు
శక్తికొలది పాటుపడినవారని వేరుగ జెప్పనక్కరలేదు. వెం
కయ్యగారు బాపట్లగ్రామనివాసులయిన దేశిరాజువారికుటుం
బములో నొకవిఖ్యాతపురుషులు. ఆయనకు కలిగిన పుత్రుని

పేరు బాపయ్యగారు. ఈబాపయ్యగారు మనకథానాయకుని పితామహులు. బాపయ్యగారి మనుమ లిరువురకు వారి పేరు పెట్టబడినందున వయసునుబట్టి పెద్దవాడగుటచే మన కథానాయకునికి పెదబాపయ్య యను పేరు వచ్చెను. పితామహులగు బాపయ్యగారి భార్య కణగాలగ్రామములో చెరుకుపల్లివారి కుటుంబమున జన్మించిన నరసమ్మగారు. ఈ దంపతులు సచ్చారిత్రము గలవారయి యన్యోన్యప్రేమతో కుటుంబధర్మములు నిర్వర్తించిరి. వీరికి వెంకటప్పయ్యగారు, శ్రీరాములుగారు, భావనారాయణగారు, సుబ్బారావుగారు, వెంకటచలపతిరావుగారు, సీతారామారావుగారు, కృష్ణయ్యగారు అను నేడుగురు పుత్రరత్నములును మాణిక్యమ్మగారు, వెంకాయమ్మగారు అను నిద్దరు పుత్రికామణులును జన్మించిరి. ఇంతపెద్దకుటుంబభారమును నిర్వహించుటలో బాపయ్యనరసమ్మగార్లు అసామాన్యధైర్యసాహసములు కనపరచి సంతానముయొక్క భావ్యభ్యున్నతికి పాటుపడిరి.

నరసమ్మగారి మేనమామ కస్తూరి అప్పయ్యగారు విశాఖపట్టణము కలెక్టరుకచేరిలో హుజూరుసిరస్తాదారుగా నాకాలమున పనిచేయుచుండిరి. తమ మేనకోడలుయొక్క కుటుంబమునకు సాయపడనెంచి వారు బాపయ్యగారికి విశాఖపట్టణముజిల్లాలో తాలూకాసిరస్తాదారు పని నిప్పించిరి.

ఈకాలములో నెన్నిపరీక్షలోప్యాసుచేసి ఎందరినో ఆశ్రయిం
చి గుమాస్తాపనియయిన దొరకక నిరుద్యోగులయియున్న
విద్యార్థికులకు బాపయ్యగారికి గొప్పచదువులేవియు లేకపో
యినను వెంటనె తాలూకాసిరస్తాదారుపని లభించెనను విష
యము విస్మయకరముగ నుండకమానదు. కాని ఆకాలపు
పరిస్థితు లట్టివి. కొంతకాలము విశాఖపట్టణముజిల్లాలో
నుద్యోగముచేసినతరువాత, బాపయ్యగారు స్వగ్రామము
విడిచి దూరదేశములో బిడ్డలతో నుండుటను సహింపజాలక
బాపట్లకు తిరిగివచ్చి యాగ్రామకరిణీకమునందు ప్రవేశించిరి.
ఆరోజులలో ఈనామ్‌కమిషనర్ కుప్పుస్వామిచెట్టిగారు గ్రా
మోద్యోగస్థులయేర్పాటు జరపుసందర్భమున బాపట్లకు వచ్చి
రి. బాపయ్యగారి పెద్దకుమారుడు వెంకటప్పయ్యగారు చక్క
ని తెలుగుదస్తూరీ వ్రాయగలిగి కరణములు కుప్పుస్వామిచెట్టి
గారికి చూపవలసినలెక్కలు మొదలయినవివ్రాసిపెట్టుచుండిరి
పిన్నవయస్సులైయున్న వెంకటప్పయ్యగారు అందమైనదస్తూరి
వ్రాయగలుగుటనె గాక కుశాగ్రబుద్ధిసంపన్నులని గూడ
కనిపెట్టి వారిని తమతోడ కోయంబత్తూరునకు తీసికొనిపోయి
కొంత తర్ఫీతుచేసి తగిన యుద్యోగములో చేర్పింపవలెనని
చెట్టిగారు కుతూహలపడిరి. దూరదేశములోనున్న కోయంబ
త్తూరునకు కేవలము పసివాడయి నట్టియు చేతికిక్కరకువచ్చు

చున్నట్టియు తమ ప్రథమపుత్రుని పంపుట తల్లిదండ్రులకు సహజముగ కష్టముగా నుండునుగదా? కాని నరసమ్మగారు భక్తివిశ్వాసములుగల సాధ్వీమణి యగుటచే సామాన్యులవలె నధైర్యము జెందక భర్తనుగూడ హెచ్చరించి వెంకటప్పయ్య గారిని కోయంబుత్తూరునకు బంప నిశ్చయించిరి. నరసమ్మగారి యీ సాహసకార్యమె దేశిరాజువారి కుటుంబము పొందిన యభివృద్ధికి ముఖ్యకారణ మాయెను. స్త్రీలు వివేకవంతు రాండ్రయి ధైర్యసాహసములతో మెలగుచుండినచో, కుటుం బము లున్నతస్థితికి రాగలవని తెలుపుట కిది యొక నిదర్శనము.

వెంకటప్పయ్యగారును ఏ మాత్రము భయపడక చె ట్టిగారితో కోయంబుత్తూరున కరిగి యుద్యోగములో జేరి యాంగ్లభాషనుగూడ నభ్యసించిరి. తరువాత చెన్నపురి రివి న్యూబోర్డుఆఫీసులో టి. రంగాచారిగారిక్రింద పనిచేసి గొప్ప మెప్పును పొందిరి. అటుపిమ్మట మైసూరురాజ్యములో ను ద్యోగముసంపాదించి యచట త్వరలో వృద్ధికివచ్చి తహసిల్ దారుపదవి బడయగలిగిరి. వెంకటప్పయ్యగారు సత్స్వభావు లగుటచే స్వసుఖాపేక్ష మదినుంచక కుటుంబాభివృద్ధికి పాటు పడబూనిరి. తాము చెన్నపురిలో నున్నప్పుడు సుబ్బారావు గారిని చలపతిరావుగారిని సీతారామారావుగారిని ముగ్గురు తమ్ములను తమవద్దకు పిలిపించుకొని వారికి చదువుచెప్పింప

మొదలిడిరి. చలపతిరావుగారు మాత్రము చెన్నపురిలో నుం
డుట కిష్టములేక యెవరితో చెప్పకుండ నొంటరిగా నంత
దూరమునుండి సముద్రముపై ప్రయాణముచేసి యెటులో
యింటికి చేరిరి. ఇట్టివి తగనిదుడుకు పనులని అప్పటికిప్పుడు
తలంపబడినను, అవి సామాన్యముగ నే మహాకార్యములకే
కారణములయి దైవఘటనలుగ తరువాత పరిగణింపబడును.
వెంకటప్పయ్యగారికి పుత్రసంతానము కలుగలేదు. తమ
తమ్ముడు శ్రీరాములుగారి రెండవకుమారుడయిన చినబాప
య్యగారిని దత్తము చేసికొనిరి. చినబాపయ్యగారు మెట్రిక్యు
లేషనువరకు చదువుకొని కుటుంబమునందు చిరకాలమునుం
డి వచ్చుచున్న కరిణీకమును చేయుచు నిపుడు బాపట్లగ్రామ
మందు పాడిపంటలుగలిగి సుఖజీవనము జేయుచున్నారు.

సుబ్బారావుగారు ఎఫ్, ఏ పరీక్షయం దుత్తీర్ణులయి
మైసూరు రాజ్యమున నుద్యోగములో జేరి క్రమముగా వృద్ధి
లోనికి వచ్చి తుదకు తహసిల్దారుపదవిని బడసిరి. ప్రస్తు
తము గుంటూరులో వకీలువృత్తి నవలంబించి విశేషద్రవ్య
మార్జించి పిల్లజమీందారుగానున్న దేశిరాజు హనుమంతరావు
బి. ఏ; బి. ఎల్ గారు సుబ్బారావుగారి పుత్రులు.

సీతారామారావుగారు కూడ ఎఫ్. ఏ పరీక్షయందు
తేరి యింజనీరింగుపరీక్షలో గెల్పొంది మైసూరుసంస్థానము

యొక్క కొలువులో ప్రవేశించిరి. వారు పాలెసుకంట్రోలరు గాను సూపరింటెండెంటు ఇంజనీరుగాను గొప్పగౌరవపదవులను పొంది మైశ్వర్యముతో జీవనము గడపిరి. వారి కుమారులు వెంకటనరసింహారావుగారు ఎఫ్, ఏ; ఇంజనీరింగుపరీక్షలయందు తండ్రిగారివలె జయముగాంచి మైసూరురాజ్యమున ఇంజనీరింగుశాఖయందు పనిచేయుచున్నారు.

శ్రీరాములుగారు బాపట్లలోనె యింటిపట్టున నుండి అన్న వెంకటప్పయ్యగారు వేరెయుద్యోగములో నుండుటచే వారి పక్షమున కుటుంబ వారసత్వమయిన కరణీకమును చేయుచు స్వార్జితమును భద్రపరచి వృద్ధినొందించుచు కుటుంబక్షేమమునకు పాటుపడిరి. వీరు గ్రామపెద్దలలో నొకరుగా నుండి గొప్పయధికారివలె మంచిపలుకుబడితో జీవించిరి. వీరిమొదటికుమారుడు రంగారావుగారు ఎఫ్, ఏ వరకు చదివి బాపట్లబోర్డుహైస్కూలులో నిపుడుపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. దేవాలయధర్మకర్తలలో నొకరుగా నుండుచు గ్రామపెద్దయై రంగారావుగారు తండ్రిగారియంశమును నిలువబెట్టిరి.

వెంకటప్పయ్యగారివద్దకు చదువునిమిత్తము వెళ్ళి బాపట్లకు మరలివచ్చిన చలపతిరావుగారు దొరతనమువారిచే కొంతకాలము మిడిల్‌స్కూలుపరీక్షయనియు కొంతకాలము

లోవర్ సెకండరిపరీక్షయనియు జరుపబడిన పరీక్షకు బదులుగా నంతకుపూర్వము గావింపబడుచుండిన అన్‌కవినెంటెడ్ పరీక్షకు చదివి యందు కృతార్థులయిరి. పిమ్మట బందరుకలెక్టరు కచేరిలో నుద్యోగమందు జేరి క్రొలదికాలములో వర్నాక్యులర్ హెడ్‌క్లార్కుపదవికి వచ్చిరి. తరువాత బెజవాడ డివిజనల్ ఆఫీసరువద్ద హెడ్‌క్లార్కుగాను, తెనాలిలో సబ్ మేజస్ట్రీటుగాను, కోసూరులోను రేపల్లెలోను హెడ్ అకౌంటెంటుగాను, అవనిగడ్డలోను బందరులోను సబ్ మేజస్ట్రీటుగాను, తుదకు పొన్నూరులో డిప్యూటితహసిల్‌దారుగాను పనిచేసిరి. చలపతిరావుగారు తమకనిష్ఠసోదరులగు కృష్ణయ్యగారి చదువుబాధ్యతను వహించి కరిణీకము చేయుచు బాపట్లలోనున్న శ్రీరాములు అన్నగారికి కుటుంబకార్యములందు సాయపడి స్వగ్రామమందును తెలుగుదేశమందును దేశిరాజువారికుటుంబము గౌరవముగాంచుటకు కారణభూతులయిరి. చలపతిరావుగారు స్వదేశమునకు తిరిగివచ్చుట యీశ్వరయోగమువలననె యని సంతసింప దగియున్నది గదా? వారికి ప్రథమకళత్రమగు అన్నపూర్ణమ్మగారివలన మన కథానాయకులయిన పెదబాపయ్యగారును ద్వితీయ కళత్రమయిన వరలక్ష్మమ్మగారివలన అన్నపూర్ణమ్మయను పుత్రికయు వెంకటప్పారావను పుత్రుడును జన్మించిరి.

వెంకటప్పారావుగారు ఎల్, ఎమ్, అండ్, ఎస్ పరీక్షయందు జయమొంది యిప్పుడు బాపట్లలో సొంతవైద్యశాల పెట్టి వైద్యవృత్తి జేయుచు పరోపకారబుద్ధితో జీవించుచున్నారు. తమవంశమున నందరికంటె ధర్మవిషయమున నధికులయి తమపేరుతో చేర్పబడిన 'పెద' యనుపదము ఘనతను సూచించుబిరుదముగా మనము గ్రహించుటకు తగినరీతిని పెదబాపయ్యగారు జీవించి శాశ్వతకీర్తిని బడసిరి.

కృష్ణయ్యగారు బి. ఏ పరీక్షలో నుత్తీర్ణులయి సెటిల్మెంటు డిపార్టుమెంటునందు దొరతనమువారికొలువు వృద్ధులగువరకు చేసి రావుబహద్దరు బిరుదము బడసి రివిన్యు సెటిల్మెంటుఆఫీసరుపదవిలో నుండగా విశ్రాంతినిగైకొనిరి. వారి ప్రథమపుత్రుండు భావనారాయణరావు బి. ఏ; బి. ఎల్ గారు తండ్రిగారు పనిచేసిన డిపార్టుమెంటునందె అసిస్టెంటు సెటిల్మెంటుఆఫీసరుగా కృష్ణాజిల్లాయందిప్పుడు పనిచేయుచున్నారు. కృష్ణయ్యగారి తక్కినసలుగురు పుత్రులలో నిరువురు బి. ఎల్ పరీక్షలో తేరి న్యాయవాదివృత్తి నవలంబించి మనప్రాంతములందె గౌరవముగ జీవనము గడపుచున్నారు.

వృద్ధినొందుట కెన్నియవకాశము లున్నను ఏకారణముచేతనో కొందరు వాని నుపయోగించుకొనజాలక వ్యర్థజీవనము గడపుటను మనము చూచెదము. బాపయ్యగారి

పుత్రులేమ్వరలో నొక్కరుమాత్రము — భావనారాయణ గారు—ఎట్టియభివృద్ధియు గాంచక యీచెప్పబడిన సత్యము నకు దృష్టాంతముగా నున్నారు. అభ్యున్నతి బాహ్యపరి స్థితులమీదనె గాక అంతరచిత్తవృత్తులమీద గూడ నాధార పడియుండును గదా?

చలపతిరావుగారు తమ ౩౨ వ యేట ముప్పురుచిన్న బిడ్డలను భూమిమీద విడిచి యకాలమృత్యువాత బడిరి. వారి కుటుంబవ్యవహారములు వారిసాహాయ్యమున వృద్ధిలోనికి వచ్చిన వారిసోదరులు కృష్ణయ్యగారు నిర్వహించిరి. పెద బాపయ్యగారును తక్కినయిద్దరుబిడ్డలును యుక్తవయసు బడయువరకు కృష్ణయ్యగారిసంరక్షకత్వమున పెరిగిరి.

పెదబాపయ్యగారి వంశవృత్తాంతము చదివిన తరు వాత, ప్రాపంచికైశ్వర్యములందు వృద్ధినొందుట కెన్నియొ యవకాశములు వారు కలిగియుండినట్లు చదువరులు గ్రహించి యుందురు. కుటుంబమునందు దాదాపుగ నెల్లరు లౌకికజీవన మున ఘనతవహించినవారె. కుటుంబపరిస్థితులనుబట్టి పెద బాపయ్యగారు తమదృష్టిని ధనముమీదను లౌకికాధికార ములమీదను నిలుపవలసియుండెను స్వార్థముకొరకు ధనము కూడబెట్టుటయు అధికారము సంపాదించుటయు నీచమని భావించుస్థితికి వచ్చిరి. తమయన్నదమ్ములందరిలోను వారు

మొట్టమొదట బి.ఏ. పరీక్షయందు గెల్పొందిరి. దొరతనము వారికొలువునం దున్నతపదవిలోనుండి తమసంరక్షణబాధ్యత వహించిన కృష్ణయ్యగారు గాని మైసూరురాజ్యమున గొప్ప యుద్యోగములోనున్న తమపినతండ్రి సీతారామారావుగారు గాని తమకు కోరికయె యుండినయెడల లౌకికజీవనమునం దెంతయొ వృద్ధిలోనికి దెచ్చెడివారే యయినను, బాపయ్యగారు తమదృష్టిని పరమేశ్వరునిమీదికి త్రిప్పి తమశక్తులను లోకసంగ్రహమునకు వినియోగింప నమకట్టిరి. తమజీవితమును సార్థకపరచుకొనుటకై వారు నిరంతరము నిరీక్షించుచుండిరి. దొరతనమువారి రాజమహేంద్రవరకళాశాలలో అసిస్టెంటులెక్చరరుగా పనిచేయుచుండినప్పుడు ఆత్మగౌరవమునకు భంగముకలిగి దొరతనమువారికొలువునె మానవలసిన యావశ్యక మేర్పడగా నాసందర్భమున వారు తమదినచర్య పుస్తకములో ౩౦-౯-౧౯౦౬ తేదీన వ్రాసిన యీక్రింది మాటలు వారిచిత్తసంస్కార మెట్టిదో స్పష్టముగ చాటుచున్నవి.

"డైరెక్టరుకు నావిజ్ఞప్తిని స్వయముగానె పంపితిని. ఈదినము నాజీవితమున నిజముగ నొకముఖ్యదినము కాంటరుగారు అడుగగా, ట్రైనింగుకాలేజిలోని పదవి నే నంగీకరింపనని వ్యవహారరీతిగా తెలిపితిని. దొరతనమువారి కొలువు

నందు నాయుద్యోగము అంతమయినది. నేడు నాజన్మదినము. నేటితో నా ౫౯ వ యేడు పూర్తియగును. నా ౫౯ వ సంవత్సరముయొక్క చివరిదినమున దొరతనమువారికొలువు నందు స్థిరపరుపబడుటకు మారుగ నే నాసేవను, బహుశా శాశ్వతముగానె, విడుచుట సంభవించినది. ఇది వాస్తవముగ ఈశ్వరవిధానము. ఇంతకంటె ఘనకార్యమేదైనను, లేక యితరమార్గముల సేవనియయినను చేయుటకు నేను విధింపబడినట్లు కానబడుచున్నది. నేను సాంఘికముగానె గాక రాజకీయముగా గూడ స్వతంత్రుడనై యుండవలెనని యీసంఘటన సూచించుచున్నది.”

పంకమునుండి పద్మము జనించి కొలనుకంతకు శోభను గూర్చినట్లు, మహామహులుగూడ విషయసంసారమునందె జన్మించి వంశమునకంతకు కీర్తిని దెచ్చెదరుగదా! పెదబాపయ్యగారి జననమువలన దేశిరాజువారివంశము వన్నెకెక్కినదనుట నిశ్చయము.

# జీవనస్మృతి

## ౩ వ ప్రకరణము

### శైశవము

చలపతిరావుగారు బందరులో కలెక్టరుకచేరియం దుద్యోగముచేయుచుండగా, హూణశకము ౧౮౮౧వ సంవత్సరము సెప్టెంబరు ౨౯ తేదికి సరియయిన వృషసంవత్సర ఆశ్వయుజ శుద్ధషష్ఠిరోజున వారిభార్య అన్నపూర్ణమ్మగారు ప్రసవించిరి. జన్మించినది మగశిశువు అగుటవలనను, అంతకు ముందు ఒకరిద్దరు బిడ్డలు పుట్టిపోవుటవలనను, అన్నపూర్ణమ్మగారు సుఖముగ ప్రసవించిరను వార్త గృహములోని వారెల్లరకు మహదానందము కలిగించెను. బారసాల యతివైభవముతో జరుపుకొనవలెనని వారువ్విళ్ళూరుచుండిరి. బంధువులందరకు ఆహ్వానపత్రములు పంపబడెను. చలపతిరావుగారి తల్లి నరసమ్మగారును ఇతరబంధువులు నొకరితరువాత నొకరు బారసాలవేడుక చూచుటకు పదునొకండవ దినమునకు పూర్వమె రాదొడగిరి. పదియవరోజు సాయంకాలము పసుపు, నూనె, చక్కెర మొదలగు వస్తువులు పురమందలి

పరిచితుల యిండ్లలో మంగళవాద్యములతో పంచిపెట్టబడెను. పురిటిస్నానమునకై సర్వము సిద్ధముచేయబడెను. నామకరణ మహోత్సవమున కేర్పాటులన్నియు జరిగెను. విందునకు కావలసినసామగ్రియు సమకూర్చబడెను. పాలును పెరుగును తెల్లవారగానె తీసికొనివచ్చుటకు అవి యమ్మువారి కుత్తరువు లీయబడెను. గృహమునచేరిన బంధువులందరు సంతోషమున దోలలాడుచుండిరి. ఉదయము జరుగనున్న యుత్సవమునకై నిరీక్షించుచుండిరి. మనుష్యుడొకటి తలచిన దైవమింకొకటితలచునను సామెత తరచు వినుచుందుము గదా? చిత్రము! హఠాత్తుగా విరుద్ధపరిస్థితులు సంఘటిల్లెను. దీపములు పెట్టువేళకు అన్నపూర్ణమ్మగారు రున్నట్లుండి తలను త్రిప్పుటను అసందర్భముగ మాటాడుటను మొదలుపెట్టిరి. బంధువులు గుమిగూడిరి. ఏదో విపరీతము జరుగనున్నదని భయపడిరి. ఈవార్తను వినినతోడనె చలపతిరావుగారు క్రుంగిపోయిరి. వెంటనె వైద్యులు పిలిపింపబడిరి. తగుచికిత్సలు చేయింపబడెను. గుణము కాన్పించుటలేదు. వ్యాధి అంతకంతకు పెరిగిపోయెను. ప్రాతఃకాలము కాకపూర్వమె పదిదినములబిడ్డను తల్లిలేనిబిడ్డను చేసి బంధువులందరను దుఃఖసాగరమున ముంచి అన్నపూర్ణమ్మగారు పరలోకగతులైరి. ఆమె యాకస్మికమరణమె హృదయములను బ్రద్దలుచేయ

చుండ, దానికి బిడ్డయొక్క యసహాయస్థితి తోడయి చూడ వచ్చినవారందరిని దుస్సహవిషాదమునకు లోనుచేసెను. ఉదయ మయిన నేమి ? వెలుగు అంతటను వ్యాపించిన నేమి? సమా వేశమయిన వారందరికి అంతయు అంధకారమయమై పోయెను. సుఖము దుఃఖముగ మారెను. బారసాలకు బదులు అంత్యకర్మలు జరుపుకొనవలసిన యవస్థపట్టెను. అట్టి పరి స్థితులందు ఘనముగ ఆశిశువునకు నామకరణోత్సవము జరుగకపోయినను, శాశ్వతముగ తననామము ప్రపంచమున నిలుపుకొనగలుగుశక్తి యీబిడ్డకు గలదని యెవరికి, అందు లో అప్పటిదైన్యమునె ముఖ్యముగ చూచి విలపించెడు బం ధువుల కెట్లు పొడగట్టును ?

బాపయ్యగారు దురదృష్టవంతులని గృహములోని వారందరు తలచి వారియెడ జాలిపడుచుండిరి. తండ్రి చలపతి రావుగారు వారియందమితానురాగమును జూపమొదలిడిరి; వారిసౌకర్యముల కెట్టిలోటును లేకుండ సర్వవిధములయిన యే ర్పాటులు చేయుటకై పూనుకొనిరి. దాదాపుగ పెదబాపయ్య గారి జననకాలమందె బందరులో నొక గొల్లకుటుంబమున ఒకశిశువుపుట్టి వెంటనె మరణించెను. ఆకుటుంబమును చల పతిరావుగారు తమయింటికి రప్పించి పెదబాపయ్యగారిని పాలిచ్చి పోషణముచేయుటకై ఆకుటుంబమందలిస్త్రీకి అప్ప

గించిరి. ఆమెపేరు మహాలక్ష్మి. ఆమెకు ఒకకొడుకును, ఒక కూతురు నుండిరి. ఆమెభర్త తనవృత్తిని జేసికొనుచు నప్పు డప్పుడు కుటుంబమును చూచిపోవుచుండెను. పెదబాపయ్య గారిని బంధువులుకూడ కొంతవరకు పోషించుచువచ్చినను వారు మహాలక్ష్మికుటుంబమునందె యెక్కువమక్కువ కలిగి యుండిరి. మహాలక్ష్మిని బాయమ్మయనియు, ఆమెకొడుకును అన్నయనియు, ఆమెకూతురును అప్పయనియు, ఆమెభర్తను అయ్యయనియు పిలుచుచు వారితో నతిప్రేమతో మెలగు చుండిరి. మహాలక్ష్మిభర్త తనబిడ్డలకు మిఠాయిపొట్లములను తెచ్చి యిచ్చినపుడెల్లను వారిచేతిలోకూడనొకపొట్లమును పెట్టు చుండెను. మాఅయ్య యిది యిచ్చినాడని యతిసంతోష ముతో నింటిలో నందరికి చెప్పుచు మిఠాయిని తినెడువారు. మహాలక్ష్మియు తనబిడ్డలకంటె నెక్కువగా వారిని ప్రేమించి మూడుసంవత్సరములకాలము చలపతిరావుగా రుద్యోగసంద ర్భముగ బెజవాడ తెనాలిపురముల కరిగినను ఆమె పెద బాపయ్యగారిని కనిపెట్టుకొనియుండి సాకెను. కోసూరునకు బదిలీఅయి చలపతిరావుగా రచ్చటికి పోయినప్పుడు, పెదబా పయ్యగారిని అమితకష్టముతో ఆమె విడిచి స్వస్థలమునకు వెళ్ళెను. పెదబాపయ్యగారు ఆమెకొరకు దిగులుపెట్టుకొనిరి. కాలక్రమమున గాని ఆదిగులు విడిచి సంతోషముగ నింటిలో

తిరుగలేకపోయిరి. వారు పెద్దవారయి బందరులో చదువు చుండినప్పుడు, ఆమె యప్పుడప్పుడు వచ్చి వారిని చూచి యోగక్షేమములు కనుగొని పోవుచుండెడిది. శైశవమునందు వారికి మహాలక్ష్మికుటుంబముతో కలిగిన గాఢసంబంధము వలన వారిమనస్సునం దెట్టిభావములు స్థిరముగ నాటుకొనెనో యెవరును గమనింపలేదు. బీదలను జూచినంతనె కనికరించి వారిని తమతో సమముగ భావించి వారికి వలసినసాహాయ్యము చేతనయినంతవరకు చేయుస్వభావమున కంకురము బాపయ్యగారియందు ఆ కాలమందె నాటబడియుండును గదా?

దాదికి బిడ్డ నప్పగించి బిడ్డముఖమునైన చూడనితల్లిదండ్రులనుగూర్చి మనము వినుచుందుము. చలపతిరావుగారు అట్టి దారుణస్వభావము కలవారు కారు. తల్లినికోల్పోవుటచే పాలిచ్చి పెంచుట కొకదాది యావశ్యకమని తలంచి వారు పెదబాపయ్యగారిని మహాలక్ష్మియొద్దనుంచిరె గాని వారు తమతోడ నెంతసంబంధము కలిగియుండవలెనో యంతయు పూర్తిగ కలిగియుండుట కవకాశమిచ్చిరి. అత్యంతగారాబముతో వారియెడ చరించుచుండిరి. ఇంటివద్ద కచేరిచావడిలో తాము కూర్చుండి యితరులతో మాటాడుచు పనులను చూచుకొనుసమయములందు తాము కూర్చుండియున్న తివాచిమీద కూర్చుండి తామానుకొనిన బాలీసును ఆనుకొని

బాయమ్మ పాలియ్యవలెనని పట్టుపట్టి పెదబాపయ్యగారేడ్చు టకలదు. బిడ్డను ఏడ్పించుట కిష్టములేక వారు వెంటనె చావడిని విడిచి మరొకచోటికి పోయి యావిధముగా పాలిచ్చుటకు మహాలక్ష్మికి చెప్పేడువారు. ఈ తీరున పెదబాపయ్యగారేది కోరిన, అది నెరవేర్చుచు తల్లిలేనిబిడ్డ గదాయని మనసును సమాధానపరచుకొనుచు వారిని మిక్కిలి ముద్దుతో చూచుకొనిరి. చలపతిరావుగారతిగంభీరస్వభావము గలిగి యధికధైర్యసాహసములతో తమవ్యవహారములు జరపుకొనువారు; అధికారదీవిని నెక్కువగ చూపువారు. వారితోడిసంపర్కము పెదబాపయ్యగారి మనోఫలకమువిూద జీవితము యొక్క గాంభీర్యమును గౌరవమును ఆధిక్యతయు ముద్రితములగుటకు తోడ్పడెననుటకు సంశయములేదు; మరియు చలపతిరావుగారి ధైర్యసాహసములు కూడ వారియందు ప్రసరించెనని నమ్మదగియున్నది.

చలపతిరావుగారు ద్వితీయవివాహము చేసికొనిరి; వరలక్ష్మమ్మగారు కాపురమునకు వచ్చిరి. రేపల్లెలో పెదబాపయ్యగారికి అయిదవయేట అక్షరాభ్యాసము జరగెను. తరువాత వారు సుమారు ఆరేండ్లప్రాయము కలిగియున్నప్పుడు తండ్రిగారితో బందరుకు వచ్చి యచట ఆంగ్లభాషను నేర్చుకొన మొదలిడిరి. అది నేర్పుటకు ఒకయాచారిగారు ప్రత్యే

క్రముగా నియమింపబడిరి. ప్రస్తుతము నందిగామతహసిల్దా
రుగా నున్నట్టియు, వరలక్ష్మమ్మగారి అన్నయు నయిన కామ
రాజు వెంకటప్పయ్య బి. ఏ. గారు అరోజులలో చలపతిరా
వుగారివద్దనుండి బందరులో చదువుకొనుచు పెదబాపయ్యగారి
చదువువిషయమున కొంతశ్రద్ధపుచ్చుకొనిరి. చలపతిరావుగా
రితూరి రమారమి ఒకసంవత్సరకాలము బందరులోనుండి
యచటనుండి బదిలీఅయి పొన్నూరుకు వెళ్ళిరి. ఇచ్చటగూడ
పెదబాపయ్యగారి చదువునకు తగినయేర్పాటులు చేయబ
డెను. మేనమామ వెంకటప్పయ్యగారు కూడ బందరునుండి
వచ్చి పొన్నూరుకు సమీపమున గుంటూరులో చదువప్రా
రంభించుటచే, శని ఆదివారములలో పొన్నూరుకు వచ్చి
పెదబాపయ్యగారి చదువునుగూర్చి విచారించెడివారు. ౧౮౮౯
వ సంవత్సరములో ఎనిమిదవయేట పెదబాపయ్యగారికి ఉప
నయనము చేయబడెను. సంధ్యావందనము చక్కగ నేర్పింప
బడెను. కుమారునకు క్రమముగా సంధ్యావందనము నడుపు
నట్లు చేయుటకు చలపతిరావుగారు శ్రద్ధతీసికొనిరి. వారు
ప్రతిదినము రామాయణపారాయణము చేయువారు; దేవ
తార్చన నిత్యము జరిపించెడువారు; హరికథలు చెప్పించెడు
వారు. వారొకవిధమగు భక్తియు నిష్ఠయు గలిగియుండిరి.
పుత్రుడు గూడ మతనిరతి కలిగియుండవలెనని అభిలషించిరి.

వారిమామగారు, కామరాజు శింగరయ్యగారు పూర్వమత సాంప్రదాయమునకు జెందిన దైవభక్తులు; గొప్పవిరాగులు; ఏకపత్నీవ్రతపాలకులు. వా రెల్ల వేళల భగవన్నామసంకీర్తన ము సలిపెడువారు. ఇతరులు రచించిన కీర్తనలనె గాక తమ భక్త్యావేశముకొలది స్వయముగ చేసిన వివిధములయిన కీర్తనలు గూడ పాడుచు తోడివారలను ఆనందమున నోలలాడించుచుండిరి. వారు తరచు చలపతిరావుగారి గృహమున వసించుచువచ్చిరి. వారిసాంగత్యమున మెలగుట బాపయ్యగారికి తటస్థించెను. మతవిషయమున తండ్రిగారు పుచ్చుకొనినశ్రద్ధయు, గృహమందలి మతవిషయిక వాతావరణమును, తాత శింగరయ్యగారి భక్తిప్రబోధమును పెదబాపయ్యగారి కోమలహృదయమున ధర్మాభినివేశము కలిగించుటకు కారణభూతములు గాకుండునా?

చలపతిరావుగారికి వరలక్ష్మమ్మగారివలన జన్మించిన అన్నపూర్ణమ్మకు మూడవసంవత్సరములును వెంకటప్పారావుకు కొలదిమాసములును ప్రాయమువచ్చెను. రమారమి తొమ్మిదిసంవత్సరములవయస్సు పెదబాపయ్యగారికి వచ్చెను. సంతానమును, సంపదను గలిగి చలపతిరావుగారు పొన్నూరులో అధికారపదవియందు ఘనముగ జీవించుచుండిరి. కాని దుర్దినములు రానున్నవి. వారిశరీరము వ్యాధిగ్రస్తమయి

క్రమముగా నీరసింపదొడగెను. బాపట్లగ్రామమునకు సకుటుంబముగ వచ్చిరి. పెదబాపయ్యగారు మెట్రిక్యులేషను బాపట్లలోనె హాజరయి యందు కృతార్థులయిరి. ఈసంతోషవార్త విని చలపతిరావుగారు కుమారు డేదో పెద్దపరీక్షలో గెల్పొందినటుల అమితానంద మొందిరి. తరువాత కొద్దిరోజులలో అనగా 1891 వ సంవత్సరము జనాభాతీయబడిన దినము ఫిబ్రవరిపదునొకండవ తేదీన చలపతిరావుగారు పరమపద మొందిరి. పెదబాపయ్యగారి కప్పుడప్పుడె బుద్ధి తెలియుచుండెను. తండ్రిగారి మరణము వారికి మేరలేనిదుఃఖము తప్పక కలిగించియుండును. లేబ్రాయములో నుండగానె ఈ మహావిపత్తు కూడ సంప్రాప్తమాయెను. కష్టములవేడిమిచేత గాని హృదయము పరిపక్వము గానేరదు. ఆపద లనుభవించినవారె ఆపదలందు చిక్కుకొని బాధపడువారియెడ సానుభూతి చూపగలరు. తల్లిదండ్రుల గోల్పోయినబిడ్డలను ఆదరించుప్రేమస్వభావము పెదబాపయ్యగారి జీవితములో కానబడిన, అందునకు హేతువు ఆయన యట్టిదుఃఖము ననుభవించుటగాక మరియొకటి యేది?

చిన్నతనములో పట్టుపడినగుణములును అభ్యాసములును తరచుగ ఆజన్మాంత ముండును గదా? శైశవమున పెదబాపయ్యగారు బడసిన గుణములును అభ్యాసములును మిక్కిలి

ముఖ్యమయినవి. ఐశ్వర్యమునందు పుట్టిపెరిగుచు దారిద్ర్యము తో చెలిమిచేసిరి. అధికారముయొక్క ఆదరముతోను సేవ యొక్క పోషణముతోను వర్థిల్లిరి. కన్నతల్లిని గోల్పోయినను, ప్రేమతో పాలిచ్చి పెంచు తల్లిని కనుకొనిరి. విద్యను చవిజూచి రి. భక్తిరసముగ్రోలిరి. జీవితము క్షణభంగురమని కన్నులార గాంచిరి.తొమ్మిదియేండ్లలోపుననె పెదబాపయ్యగారి కీవివిధా నుభవములు కలిగెను. చిన్నతనమందె చిత్తమెట్టిసంస్కార మందెనో చదువరు లూహింపగలరు. ఈశ్వరవిశ్వాసమున, సర్వమానవసోదరత్వమును, సేవాధికారపదవుల సమానత్వ మును, ఆత్మగౌరవమును, జ్ఞానభక్తివైరాగ్యములను వా రుగ్గుపాలతో గ్రహించిరని చెప్పవచ్చును. వారియందవి యావయసున స్పష్టముగ గాన్పింపకపోయినను, బీజరూప మున తప్పక యుండెనని యంగీకరింపక తప్పదు. ఈచిన్న తనమునందు గూడ నవి కొంచెముకొంచెము కాన్పించు చునె యుండెను. పౌన్నూరులో నొకరోజున పంతులుగారు వచ్చి పెదబాపయ్యగారికి చదువుచెప్పుచుండిన సమయ ములో వారిమీద నింటిలోనియూడువా రేదోయల్లరి చేసి రని పితూరిచేయగా పంతులుగారు వారిని బెత్తము తీసి కొని కొట్టిరి. వారా బెత్తము లాగుకొని దానితో పంతులు గారికి రెండంటించిరి. పంతులుగారు చలపతిరావుగారియొద్దకు

వెళ్ళి ఫిర్యాదు చేసికొనవలసివచ్చెను. "ఇదేమిరా, ఈలా చేశావు?" అని తండ్రిగారు గసురగానే, "పంతులుగారు నన్ను అన్యాయముగా కొట్టినారు. చదువకపోతే, వ్రాయక పోతే, చదువులో వారు చెప్పిందేదైనా చేయకపోతే, వారు కొట్టే కొట్టవచ్చుగాని యింట్లోవారేదో చెప్పినదానికి నన్ను కొట్టడమెందుకూ?" అని పెదబాపయ్యగారు వాదిం చమొదలుపెట్టిరి. తండ్రిగారు కుమారుని ఆవలకుపంపి "చిన్నపిల్లలకు కొట్టి చదువుచెప్పుట పనికిరాదు. అందులో తల్లిలేని పిల్లవాడు. కఠినముగా చూడకండి." అని పంతులుగారితో చెప్పిరి. అన్యాయమున కెదురుతిరుగుస్వభావము పెదబాపయ్యగారియందు దాయల్పవయస్సునందే కానబడుచుం డెను. తమవలెనె పితృవాత్సల్యమునకు దూరులయిన తమ చెల్లెలు అన్నపూర్ణమ్మను, తమ్ముడు వెంకటప్పారావును వారమితముగ ప్రేమింప మొదలిడిరి. చవతితల్లియయినను, వరలక్ష్మమ్మగారిని సొంతతల్లివలెనె ప్రేమించి యామెతో చరింపనారంభించిరి. నానాల్గవయేట నాతల్లిని గోల్పోయి నాయక్కగారును వారి తల్లియునైన వరలక్ష్మమ్మగారియం దను నేను చేరవలసినవాడనైతిని. మాతృవిహీనుడనైన నాయందును వారు సహజముగ నెంతయో ప్రేమ కనపరచిరి. చిన్నతనమందు వారెవరెవరిని ప్రేమించిరో వారందరిని

నిరంతరాయముగ ప్రేమించియుండుటనుబట్టి పసితనమందే వారిహృదయము యథార్థప్రేమకు నిలయమయ్యెనని విశ్వసింపదగును. వేళలకు సంధ్యావందనము సలుపుచు నొకవిధమయిన మతనిష్ఠను గూడ వారు శైశవమునందే యలవరచుకొనగలిగిరి. ఈమతనిష్ఠ యేదోరూపమున వారిజీవితమునెల్లప్పుడంటియెయుండెను.

మొగ్గయందు కొంతవరకైనను పువ్వుయొక్క లక్షణము లెట్లు కాన్పించకుండును?

# జీవనస్మృతి

## ౨వ ప్రకరణము

### బాల్యము.

చలపతిరావుగారి మరణానంతరము వారికుటుంబము స్వస్థలమయిన బాపట్లలోనె యుండిపోయెను. ఇంటిలో నన్న బిడ్డలు, పెదబాపయ్యగారును వారికంటె చిన్నవయస్కులమయిన వారిచెల్లెలును తమ్ముడును నేనును, వరలక్ష్మమ్మగారిచేతను ఆమెబావ భావనారాయణగారిభార్య భవానమ్మగారిచేతను పోషింపబడుచుంటిమి. శింగరయ్యగారు తరచు బాపట్లలోనుండి గృహకృత్యములందు తోడ్పడుచుండిరి. ఉద్యోగకారణమున గ్రామాంతరమునం దుండినను కృష్ణయ్యగారు కుటుంబయాజమాన్యము వహించిరి. శ్రీరాములుగారి కుటుంబమును ఇతరబంధువులకుటుంబములును అచట గలవుగాన, పలువురురక్తబంధువులతో కలసిమెలగుటకు పెదబాపయ్యగారి కవకాశమేర్పడెను. ఆదరించువా రెందరుండినను, తల్లిదండ్రులు లేనికొరత నెవరు దీర్పగలరు ? అయినను ప్రేమాస్పదులగు బంధుకోటినడుమ జీవించుచు హృదయ

శాంతిని బడసి విశాలప్రేమయందు పెదబాపయ్యగారు పెరుగనారంభించిరి.

ఆయన బాపట్లగ్రామమందు ౧౮౯౧, ౧౮౯౨, ౧౮౯౩ సంవత్సరములు మూడును ఒక్కపట్టున మొదట గడపెను. ఈమూడుసంవత్సరములలో ఆయనవయస్సు పది, పదునొకండు, పండ్రెండు ఏండ్లు పూర్తియగుచుండెను. అది కేవలము బాల్యకాలమయినను, మొదటినుండి క్రమశిక్షణమున పెరిగియుండుటవలనను, సదభ్యాసములుగొన్ని యంతకు బూర్వమె కలిగియుండుటవలనను, సూక్ష్మబుద్ధిసంపన్నులగుటవలనను, ఆయన తోడిబాలురకంటె నెక్కుడుతీరుగా నడచుకొనగలిగియుండెను. ప్రతివిషయమునను విధికృత్యముల నిర్వర్తించుచుండెను. స్నానము, సంధ్య, చదువు మొదలగునవి వేళలకు జరపుకొనుచుండెను. అనావశ్యకమయిన ప్రసంగములకుగాని సహవాసములకుగాని పోక తనపనులయందెక్కువదృష్టి గలిగి చరించుచుండెను. ఇట్టిక్రమవర్తనముగల ఆయనజ్ఞానమును వికసింపజేయుటకు బాపట్లగ్రామపరిసరములందలి సృష్టివైచిత్ర్యములును తప్పక తోడ్పడియుండును. ఇసుకలో ఆటలాడియుండును. పచ్చికబయళ్ళలో బరుగులిడియుండును. సంగీతపుచెట్ల శ్రావ్యగాన మాలించియుండును. సముద్రమునం దుప్పొంగుతరంగములలో స్నానములు చేసి

యుండును. బాలునికానందము కలిగించుటకు నివి యెంతయొ సాయపడియుండునుగదా ! ప్రకృతివైపునకు ఆయనమనసు మరలియుండుననియు, సృష్టితో చెలిమిచేసినకొలది సంతోష మధికము కాగలదని ఆయన తెలిసికొనెననియు నమ్మదగును. మరియు కృషికులు సేద్యముచేసి పంటలు పండించుటకు పడు శ్రమను గాంచి తీవ్రమయిన ప్రయత్నముండినగాని మానవుని యాశయములు సఫలీకృతములు గాజాలవని ఆయన గ్రహించియుండునని కూడ చెప్పవచ్చును.

బాపట్లకు వచ్చినప్పటినుండి ఆయన పాఠశాలలో జేరి చదువ మొదలుపెట్టెను. ఆ మూడుసంవత్సరములలో వరుసగా మొదటిఫారమును రెండవఫారమును మూడవఫారమును జదివి లోవర్ సెకండరీపరీక్షయందు కృతార్థుడయ్యెను. ఆయన గృహాసంబంధములయిన కొన్నివిచారములకు లోను గావలసివచ్చినను, తన చదువువిషయమయి తగినవిచారణ చేయగల మగవారెవరు నింటివద్ద లేకపోయినను ఏదియు తప్పకుండ మొదటిమూడుఫారములను ముగించుకొనగలుగుట వలన చిన్నతనమందె ఆయనకు విద్యయెడ నమితశ్రద్ధ గలదని స్పష్టమగుచున్నది. ఇంటివద్దకూడ ఆయనకు ప్రత్యేకముగ చదువు చెప్పింపబడెను. చదువులో మంచిపునాది యీకాలములో పడినదని చెప్పవచ్చును. బాపట్లలో ఆదినములందు

లోవరు సెకండరీవరకే పాఠశాలలో చదువు చెప్పబడుచుండె
ను. ఆతరగతియందు చదువు విద్యార్థులు సంవత్సరాంతమున
గుంటూరుకు వెళ్ళి పరీక్షకు హాజరై ప్రశ్నపత్రములకు
జవాబులు వ్రాయవలసియుండెను. మంచి రోడ్డుండుటవలన
ప్రయాణసౌకర్యము కొంత యేర్పడియున్నను బాపట్లనుండి
గుంటూరుకు ఎద్దుబండిమీద పోవుటకు సుమారు మూడు
ఝాములు పట్టుచుండెను. ౧౨ సంవత్సరముల లోపువయస్సు
గల బాలురు అట్టిపరీక్షకు చదువవలచిన నెంతప్రయాసకును
ఆదుర్దకును లోనుగావలసివచ్చునో యోచించుకొనుడు. ఎటు
వంటి సామాన్యపరీక్షకు హాజరుకావలసినను పిల్లలు మిక్కిలి
భయపడుదురు. ఏదో గవర్నమెంటువారుజరపుపరీక్షయనియు,
దూరపట్టణమునకు వెళ్ళి హాజరుకావలసిన పరీక్ష యనియు,
ఉపాధ్యాయులు చెప్పుచు అందునకు వా రెంతోకష్టపడుచు
త మ్మెంతో తంటాలు పెట్టునప్పుడు, బిడ్డల కనావశ్యకమయిన
భీతి యమితముగ కలుగుననుటకు సంశయము లేదు. పరీ
క్షకు వెళ్ళిన తప్పక కృతార్థులగుదురను నమ్మకముండిన,
బాలు రంతగా బాధపడరు. పలువురలో చాలకొలదిమంది
మాత్రమె గెలుపొందుదురు. ఎంతచదివినను తనకు జయము
కలుగునో లేదో యని ప్రతిబాలుని హృదయము దడదడ
కొట్టుకొనును. నాగరకతజెందిన యేదేశమందును బిడ్డలీతీరున

చదువునిమిత్తము హింసింపబడరు. పరీక్షలనగా నిటువంటివె
యను విశ్వాసము కుదిరినవారై మన దేశమందలి పాఠశాలల
యొక్కయు కళాశాలలయొక్కయు సధ్యక్షులు స్వదేశస్థు
లయినను పైయధికారులు జరపుపరీక్షావిధానమునందు మా
ర్పులు కలిగించుట కెట్టిప్రయత్నములు సలుపకపోవుటయె
గాక తాము జరపుపరీక్షలయందును నతిక్రూరముగ నడచు
కొనుచు పరీక్షలను గొప్పజాతరలుగ మార్చివేయుచున్నారు.
ఇట్టి యద్భుతవిద్యాధికులమూలమున దేశమందు విద్యా
వ్యాపన మెన్నటికయినను కాగలుగునని యాశించుట వట్టి
భ్రమ. పెదబాపయ్యగారు లోవర్ సెకండరీపరీక్షసంబంధ
ముగ నెంత భీతిల్లియుండినను, మనస్స్థైర్యము కలవారగుటచే
మొదటితూరియె యందు జయముగాంచిరి. బుద్ధి తెలిసిన
తరువాత ఆయన మేడలు, మిద్దెలు కలిగి కొంతవరకు పట్ట
ణాకారము దాల్చినయూరును దర్శించినది పరీక్షకొరకు
గుంటూరుకు వెళ్ళినప్పుడే. గుంటూరుకు కొంతదూరములో
మార్గమధ్యమందుండగానె కాన్పించు గుంటూరుకళాశాలా
శిఖరమును ఆయన జూచి యది యెట్టిదోయని యూహించు
కొనుచు తుదకు దగ్గరకుపోయి పూర్తిగగాంచి కొంతవిస్మయ
ము జెందియుండును. అచటి రైలుస్టేషనుకు వెళ్ళి రైలు
బండ్లను ఇంజనులను కనుగొని యద్భుతపడి తమబాపట్లకు

గూడ నెప్పుడు రైలు వచ్చి బండ్లప్రయాణమువలని బాధలు తొలగునాయని తలపోసియుండును. అక్కడి లోతుబావులలో తొంగిచూచినప్పుడు కండ్లు తిరిగి ఆయనకు గుంటూరునెడ కొంతయసూయ పుట్టి తమబాపట్లే మంచిదని తోచియుండ వచ్చును.

బ్రాహ్మసమాజమునందును సంఘసంస్కరణమునం దును అభిమానము గలిగియుండిన వల్లూరి నరసింగరాయడు గారు బాపట్ల లోవరు సెకండరీస్కూలుకు ప్రధానోపాధ్యా యులుగ పెదబాపయ్యగారు లోవరుసెకండరి చదివిన సంవ త్సరమంతయు నుండిరి. నరసింగరాయడుగారి కిటీవల కొంత కాలమునుండి యభిప్రాయములందు మార్పుకలిగి యెట్టి మతసంఘసంస్కరణోద్యమములతోడ సంబంధము లేకపోయి నను, పూర్వము వారు మతసాంఘికవిషయములనుగురించి మహోపన్యాసము లొసంగుచు సంస్కారభావములను వెద జల్లుచుండెడువారు. కీర్తిశేషులయిన బొప్పూడి వెంకటప్ప య్యగారిచే ౧౮౭౮ వ సంవత్సరములో బాపట్లయందు స్థాపింపబడి యప్పుడు నడచుచున్నట్టి బ్రాహ్మసమాజ ముయొక్క యుపాసనాసభలయందు నరసింగరాయడుగారు పాల్గొనుచుండిరి. చక్కనిబోధనాశక్తి గలిగి బాలురకు నేర్పుతో విద్యగరపుచు తమకును బాలురకును సంబంధము

పాఠశాలలో నున్నంతవరకె యని తలంపక బాలురతో నతి సఖ్యముగ బయటను మెలగుచుండిరి. విద్యార్థులు వారిగృహ మునకు మిక్కిలి స్వేచ్ఛతో వెళ్ళి వారితో చదువువిషయ ములోనె గాక యితరవిషయములలోను ముచ్చట లాడెడు వారు. పెద్దపులివలె కనబడి పిల్లలను దరికి రానీయకుండ భయపెట్టినగాని తమ పెద్దరికమునకు లోటువచ్చునని భ్రమ పడు నుపాధ్యాయులకును నరసింగరాయఁడుగారికిని నెంతయొ వ్యత్యాసము కలదు. ఇతరబాలురతో పాటు పెదబాపయ్య గారు కూడ వారిగృహమున కరిగి వారితో విశేషకాలము గడపుచుండిరి. వారియెడ పెదబాపయ్యగారు అందరికంటె నెక్కువయభిమానము కలిగియుండిరని యితరవిద్యార్థులను కొనుచుండిరి. ఇప్పుడు బాపట్లలో న్యాయవాదిగానున్న రామరాజు చెంచు రామయ్యగారు పెదబాపయ్యగారి సహ పాఠకులై ఆరోజులలో వారితో నెక్కుడు స్నేహము కలిగి యుండెడివారు. నరసింగరాయఁడుగారి ప్రేమస్వభావముచే నాకర్షింపబడి వారితో నెక్కువ చేరిక యగుచున్న బాలుర కోమలహృదయములందు వారి నంస్కరణభావములు కాన రాకుండ కొంతవరకు ప్రవేశించెనని నమ్మదగియున్నది. అప్పుడు నాటుకొనిన యభిప్రాయములె చెంచు రామయ్య గారియందు నెట్టి యాటంకమునకు లోనుగాక త్వరలో వారి

హృదయమును కొంతవరకు వశపరచుకొనగలిగి వారిమూల
మున బ్రాహ్మసమాజోద్యమమునకు గుంటూరులోను బాప
ట్లలోను ఆప్రాంతమున నితరచోట్లను కొంతవ్యాపనము కలి
గెను. పెదబాపయ్యగారు పూర్వాచారబద్ధులై యుండుట
వలన అంతసులభముగ మార్పు జెందలేదు. అదిగాక నవీన
భావము లెక్కుడ నంటిపోవునో యని యింటివద్ద పెద్దవారు
ఆయనవిషయమున నెక్కుడు శ్రద్ధతీసికొనిరి. ఆయన చురు
కయినవాడుగాను, ప్రత్యక్షముగ కాన్పించు త్రికరణశుద్ధికల
వాడుగాను మొదటినుండియు నుండెనని వృద్ధులయి విశ్రాంతి
గైకొని ప్రకృతము రాజమహేంద్రవరములో నివసించుచున్న
నరసింగరాయడుగారు ఆయనను గురించి మాటాడుచు నాతో
అనిరి.

ఈబాల్యకాలములో సహితము పెదబాపయ్యగారు
స్వతంత్రబుద్ధితోనె చరించుచుండిరి. నరసింగరాయడుగారు
దాక్షిణాత్యులయిన ఒకఅయ్యరుకు బదులుగా బాపట్లపాఠ
శాలలో నుపాధ్యాయులుగా నియమింపబడిరి. నరసింగరా
యడుగారు పనిలోచేరిన కొన్నిమాసములకు ఆ అయ్యరు
తిరిగివచ్చునని తెలిసెను. నరసింగరాయడుగారిని విడుచుటకు
గ్రామములోని పెద్దలకును, పాఠశాలవిద్యార్థులకును ఇష్టము
లేకుండెను. వారిని నిలుపుకొనుటకు పెద్దలు చేయవలసిన

ప్రయత్నములు పెద్దలు చేసిరి. పిన్నలుకూడ తమకు తోచి నట్లు తాము ప్రయత్నించిరి. ఒక మహాజరును తయారుచేసిరి. చాలమంది బాలురు సంతకముచేసి దానిని పెదబాపయ్యగారి యొద్దకు తీసికొనివచ్చి సంతకము చేయుమని కోరిరి. అది యంతయు ఆయనచదివి, 'ఈ కోరిన యేర్పాటు నాకిష్టమే. నరసింగ రాయడుగారిని మిక్కిలి ప్రేమింతునని మీకూ తెలుసును. కాని యీ మహాజరుపనికి బాలురమైన మనం పూనుకో కూడదని నాకు తోస్తున్నది. నేను సంతకం పెట్టజాలను' అని చెప్పి మహాజరు పట్టుకొని వచ్చినవారిని పంపివేసెను. ఆ కాగితముమీద రామరాజు చెంచురామయ్యగారును పెద బాపయ్యగారితోపాటు సంతకముచేయలేదు.

బాల్యమునందె తమకు న్యాయమని తోచినవిషయమున నింత మనోదృఢత్వము కనపరుపగలిగిన పెదబాపయ్య గారు భావిజీవితమందు ధర్మవిషయములం దెంతధైర్యస్థైర్యములతో నడచుకొనునో చదువరులె తెలిసికొనగలరు.

---

# జీవనస్మృతి

## ౫ వ ప్రకరణము

### కళాశాలవిద్య

ఉన్నతవిద్యాసంపాదనమునకై బాపట్ల విడిచి యితర పట్టణములయందు ౧౮౯౪ వ సంవత్సరము మొదలుకొని ౧౯౦౪ వ సంవత్సరమువరకు పెద్దసెలవులు తప్ప యావత్కాలమును పెదబాపయ్యగారు గడపియుండిరి. ఆ కాలములో, అయిదుసంవత్సరములు బందరులోను, ఒకసంవత్సరము గుంటూరులోను, నాలుగుసంవత్సరములు చెన్నపట్టణములోను, ఒకసంవత్సరము రాజమహేంద్రవరములోను ఆయన నివసించెను.

మేనమామ వెంకటప్పయ్యగారు బి. ఏ. చదువుటకు బందరులో నుండవలసియుండుటచే వారితో పెదబాపయ్యగారచట నుండి విద్య నభ్యసించునట్లు మొదట నేర్పాటుచేయబడెను. నోబిలుకాలేజిలో జేరి నాలుగవ ఫారమును అయిదవఫారమును చదివిరి. తరువాత వెంకటప్పయ్యగారు బందరు విడువ తలపెట్టుచుండుటచే, ఆయన బాపట్లసమీపమునందున్న

నమం దుండి నోబిలుకాలేజిలో ౧౮౯౭ సంవత్సరమందు మెట్రిక్యులేషను తిరిగిచదివి పరీక్షలో మొదటితరగతిని తేరెను. పిమ్మట ఎఫ్. ఏ జ్యూనియరును సీనియరును అచ్చటనె చదివెను. కారణాంతరములవలన ఎఫ్. ఏ పరీక్షకు పూర్వము కొంతకాలము కాలేజిహాస్టలులో భోజనము చేయుచు అచటనె నివసించెను. ఆపర్యాయము ఎఫ్. ఏ పరీక్షయందు కృతార్థుడు కాకపోయెను. స్వగృహములందు ఒకవిధముగుపద్ధతిని పెరిగినపసివారు విద్యకొరకు నితరగ్రామములకు పోయి యచట తగినసౌకర్యములు లేక ఆరోగ్యము చెడి చదువు సాగక పరీక్షలయందు తప్పిపోవుటను మనము సామాన్యముగ చూచుచుందుము. విద్య నేర్చుటకు మనదేశమందిట్టియు నాటంకములే; పెదబాపయ్యగారుకూడ నిటువంటికష్టములకు లోనవుచు చదువునందు కొంత వెనుక పడవలసినవా రయిరి. కాని ఆయన మిగులపట్టుదల కలవాడగుటచే తాను చదువదలచిన విద్యనంతయు చదువగలిగెను. ఎఫ్. ఏ తప్పిపోయినతరువాత, ఆయన బందరులో నుండుటకిష్టపడక చెన్నపట్టణమునకు వెళ్ళి క్రిస్టియను కాలేజిలో ప్రవేశించి చదువనారంభించెను.

౧౯౦౦, ౧౯౦౧, ౧౯౦౨, ౧౯౦౩ సంవత్సరములు నాలుగును ఆయన చెన్నపట్టణమందు విద్యనార్జించుచు గడ

పెను. మొదటిసంవత్సరములో ఎఫ్. ఏ పరీక్షయందును, తరువాత రెండుసంవత్సరములలో బి. ఏ. పరీక్షయందును జయముగాంచెను. బి. ఏ లో తత్వశాస్త్రము చదివి మొదటి తరగతిని కృతార్థు డాయెను. ప్రకృతిశాస్త్రము ఉపాధ్యాయవృత్తికి మిక్కిలి యుపయోగముగా నుండునని తలచి అది మరియొకసంవత్సర మభ్యసించి యందును పట్టముబడసెను. ౧౯౦౩ సంవత్సరము ముగియునప్పటికి డబుల్ గ్రాడ్యుయేటు అనగా రెండుశాస్త్రములందు పట్టభద్రుడాయెను. కళాశాలవిద్య ప్రారంభించినప్పటినుండియు తా నేవృత్తి నవలంబింపవలయు నని తనలో తాను విచారించుకొనుచుండెను. తోడిజనుల కెక్కువ యుపయోగకరమయిన వృత్తియందు ప్రవేశింపవలయునని ఆయన యాశయము. నానావిధములయిన వ్యాధులచే బాధపడుచు ఆదరపూర్వకముగ వైద్యసాహాయ్యము చేయు వైద్యులకొరకు నిరీక్షించురోగులు మనదేశమున నెందరో గలరు. వైద్యముద్వారా మానవసేవ చేయుటకు నెక్కుడవకాశ మున్నది కావున, వైద్యవిద్య నేర్వవలయునని ఆయన మొదట తలపెట్టెను; కాని తనకు తగినంత దేహారోగ్యము లేదని డాక్టరులు చెప్పినందున ఆచదువు మానుకొనెను. పిమ్మట ఉపాధ్యాయవృత్తియందు జేరుటకు నిశ్చయించెను. వృత్తి నిర్ణయించుటలో తన కెక్కువడబ్బు

వచ్చుసాధనముగ నది యుండవలెనని ఆయన యెన్నడును తలపోసియుండలేదు. అటువంటి వృత్తులనుగురించిన యాలోచన ఆయనమనస్సులోనికి రాలేదనియె నుడువవచ్చును. దేశపురోవృద్ధి ముఖ్యముగ నెవరిపై నాధారపడియున్నదో యట్టి యువకులతో నధికసంబంధము గలిగి వారికి విద్య గరపుటకే గాక సద్వర్తన మలవడజేయుటకును ఉపాధ్యాయవృత్తి మిక్కిలియనుకూలముగ నుండునుగాన ఆయనదృష్టి దానిమీదికి మరలెను. అందునకు వలసినవిద్య నభ్యసించెను. మరియు ౧౯౦౪ వ సంవత్సరములో రాజమహేంద్రవర బోధనాభ్యాసకళాశాలయందు ఎల్. టి పరీక్షకు జదివి యాసంవత్సరాంతమున నందు తేరెను.

విద్య నేర్చుచుండినకాలములో తా నొంటరిగా చెన్నపట్టణమువంటి పెద్దపట్టణములో వసించినప్పుడు గూడ ఆయన తనకర్తవ్యములందు అమితశ్రద్ధ గలిగి నియమానుసారముగ జీవితముగడపెను. తన కక్కరలేని యితరవిషయములలో నేమాత్రము జోక్యము కలిగించుకొని తనకాల మెప్పుడును వ్యర్థముచేసికొనలేదు. తనకాల మొకక్రమపద్ధతిని వినియోగించుచు నేవేళల కేపనులు జేయ నిర్ణయించుకొనునో నాయావేళల కవి తప్పక జేయుచుండెను. సంవత్సరము మొదటిదినమున కెన్నిగంటలు చదువునో సంవత్సరాంతమున పరీక్ష

సమయములో సహితము దినమున కన్నిగంటలె చదివెడు
వాఁడు. పరీక్షసమీపించుచున్న దను నాతురతతో విద్యా
ర్థులు సాయంకాలసమయములందు మేడలమీద పుస్తక
ముకచేత పట్టుకొని చదువుచు తలదిమ్మెక్కి నొప్పిపెట్టుటచే
రెండవచేతితో నొక్కుకొనుచు బాధపడుచుండ, ఆయన
ప్రతిసాయంకాలము షికారుకు వేళకాగానె బయలుదేరి
వెళ్ళుటను వారు జూచి యెంతయు నాశ్చర్యమును ఈర్ష్యయు
జెందుచుండిరి. ఎల్. టి. పరీక్షకుముందు ఆయన కెక్కువ
జబ్బుచేసి చివరిమాసములలో నేమియు చదువుటకు వీలుగాక
పరీక్షకు వెళ్లుటకును అశక్తుఁడుగా నుండియున్నప్పుడు, పరీక్షకు
వెళ్ళి బాధపడవద్దని మిత్రులు సలహాచెప్పినను, సంవత్సరా
రంభమున పుస్తకములు చదివి తాను వ్రాసిపెట్టుకొన్న విష
యములను పరీక్షదినమున నొకపర్యాయము చూచుకొని
పరీక్షకు హాజరయి యాసంవత్సర మందు గెల్పొందగలిగెను.
వేళతప్పకుండ రాత్రులందు ౯ గంటలకో ౧౦ గంటలకో
పరుండి చీకటితో నిద్రలేచి కాల్యకృత్యముల తీర్చుకొను
వాఁడు. ఆవశ్యకమయినంత నిద్రయు పరిశ్రమయు కలిగియుండి
మనస్సు నిర్మలముగాను ఉత్సాహవంతముగాను నుంచు
కొన్నప్పుడు ఒకఁడు ఒకగంట చదివినది వాఁడె అలసి విసుగు
జెంది యున్నప్పుడు కొన్నిగంటలు చదివినదానితో సమాన

మగునని ఆయన తరచుచెప్పునట్టి సదుపదేశము. ఈవిష
యము విద్యార్థులు ముఖ్యముగ గమనింపవలయును. ఆయన
యెవరెవరివద్ద విద్యనభ్యసించెనో వారెల్లరిప్రేమకును గౌరవ
మునకును తనపరిశుద్ధవర్తనముచే పాత్రుడగుచుండెను. లో
వరుసెకండగి చదివినప్పుడు నరసింగరాయుడుగారికి కలిగిన
సదభిప్రాయమె ఆయనయెడ నితరగురువులందరు కలిగియుం
డిరి. చెన్నపురి క్రిష్టియన్‌కాలేజీలో ఆయన కధ్యాపకులుగా
నుండిన మఫాట్‌గారును స్కిన్నరుగారును మెస్టన్‌గారును
డాక్టరు మిల్లరుగారును ఆయనయందమితానురాగమును కలిగి
యుండిరి. ఆయన ఆకాలేజి విడిచినతరువాత ఆయనబంధు
వులు ఆయనతో తమకుగల బంధుత్వమును కళాశాలాధ్యక్షు
లకు తెలుపుకొనినంతనె సులభముగ నందు చదువుకొనుటకు
ప్రవేశమును బడయగలిగిరి. తనగురువుల సన్మానమునకు
తగియుండుటకు ఆయన వారి గుణవిద్యావిశేషముల
గ్రహించి వారియెడల నమితశ్రద్ధాభక్తుల జూపుటయె యని
వేరుగ జెప్పనక్కర లేదు. తన శరీరమందు అస్వస్థతగా నుం
డియు, డాకరు మిల్లరుగారు స్కాట్లెండు దేశమునకు
పోవనైయున్నతరి ౬-౩-౧౯౦౭ తేదిన వారిని దర్శించి నాడు
ఆసందర్భముగ తన దినచర్యపుస్తకమునం దీక్రిందివిధమున
వ్రాసికొనెను

"డాక్టరు మిల్లరుగారిని దర్శించితిని. వారు స్కాట్లెండుకు పయనమగుచున్నారు. వృద్ధాప్యమున తమకార్యక్షేత్రమును విడిచిపోవుటకు తమ యయిష్టమును కనపరచుచు వృద్ధులగు నామహామహుడు నుడివిన నుడువు లాలకించు టెంతయు విచారకరముగనుండెను. వారియందలి మృదుస్వభావము సువ్యక్తమగుట కూడ గాంచితిని. నేను దుఃఖము నాపుకొన లేకపోతిని. యథార్థమయిన మహాపురుషుల నెరుంగుభాగ్యము నాకు ప్రసాదించినందులకు ఈశ్వరునకు ధన్యవాదములు."

పెదబాపయ్యగారు తమగురువులయెడ నిట్టిసద్భావము కలిగియుండుటవలననె ఆయన వారిమన్ననలకు పాత్రులగుటయె గాక వారినుండి గ్రహింపవలసిన సద్విషయములను గ్రహించి తమబుద్ధిని వికసింపజేసికొన గలిగెను. ఆయన పూర్వాచారములందు మొదటినుండియు దృఢవిశ్వాసము కలిగియుండి వానిని హృదయపూర్వకముగా ననుసరించుచుండెను. గాన, తమగురువులు తెలిపినయభిప్రాయము లెంతయుత్కృష్టము లయినవయినను విచక్షణముచేయక యెప్పుడును స్వీకరింపలేదు. స్వకీయములయిన విశ్వాసములు లేనివారు తామెవరి ననుసరించి జీవింతురో వారివలె నంధప్రాయముగ మారిపోవుదురు. పెదబాపయ్యగా రట్టి తెగకు

